# పీఠిక

పలుకు నిలుపరింపఁ బలుకున నలరింపఁ బలుకు భావమునను వెలుఁగింప
బలికి పలుకరింపఁ బలుకుచుఁ బులకింప నీరవీంద్రుఁ డొక్కఁడే యెఱుంగు.

ఈనవల రవీంద్రకవిచంద్రుఁ విరచిత వంగభాషామాతృక కనువాదము. విశ్వభారతీమూర్తి యగు రవీంద్రునివాణి యిందు సహస్రముఖముల సుసమనోరంజనముగ శాంతమధురగానము చేసినది. దేశాభిమానుల దివ్యతత్త్వము లిందున్నవి. మతాభిమానుల మంత్రబీజము లిందున్నవి. సంస్కారణాభిమానుల సాధుభావము లిందున్నవి. కవితాభిమానుల కావ్యకళ లిందున్నవి ఇది నవలయే కాదు, నవభావకుసుమాకరము, నవరసకమలాకరము, నవరత్నరత్నాకరము, నవనవానందసుధాకరము, నవజీవనప్రభాకరము!

మనోభావములఁ గన్నులఁగట్టుటకును హృదయాంతర్భావముల హృదయముల ముద్రించుటకును వివిధప్రకృతుల విచిత్రముగఁ జిత్రించుటకును రవీంద్రుఁడు మిగులనేర్పరి. భావనాతీతములగు ప్రకృతిరహస్యములను బలుకులలో బయటఁబెట్టుటయందతఁడు గడుదిట్ట.

శ్రీరవీంద్రనాథ ఠాకూరు వంగభాషయందలి తమకృతుల నన్నిటి నాంధ్రీకరించుటకు మా కవకాశము కల్పించినందులకు వారికి మేమెంతయుఁ గృతజ్ఞులము.

మాయెడలఁ బరిపూర్ణాదరభావము కలిగి మమ్మెల్లవిధముల నాత్మీయులనుగా భావించి మాయుద్యమమును మన్నించి మాకవితను గౌరవించు శ్రీ రఘుపతి వేంకటరత్నము నాయుఁడుగారి యమూల్యప్రేమమున కీగద్యకావ్యము నాంధ్రీకరించి యంకిత మొనరింపఁగలిగినందులకుఁ బరమానందభరితులము!

# ప్రేమ రత్నాంకితము

శ్రీనిలసద్గుణమణికిన్
ధీనిభవాచార్యమణికి దివ్యప్రేమా
ప్లావితజీవనమణికిన్
శ్రీవేంకటరత్నభక్తచింతామణికిన్.

నిండినయమృతనదమువలెఁ
బండినపొలమువలెఁ గంటఁబడిన గనివలెన్
దండ నిలిచి యగతికజన
మండలిఁ గరుణించువిబుధ మానితమణికిన్.

కల్యాణమయమైన గనిలోనఁ బ్రభవించి
ఘనతపోమయమైన తనువు గాంచి
శాంతమయంబైన శాణఘృష్టినఁ దేఱి
ధర్మమయంబైన తళుకుఁ జెంది
సౌభాగ్యమయమైన సాధుమాళినిఁ జేరి
విశ్వమయంబైన విలువ నలరి
ఆనందమయమైన యమృతతేజము నొంది
విజ్ఞానమయమైన వెలుఁగు సూపి

అమృతకళలచే నఖిలంబు నలరఁజేయు
రఘుపతికులాబ్ధికౌముదీరత్నమునకు
రమ్యగుణనిధి వేంకటరత్నమునకు
నంకితంబుగ నీకృతి యలరుఁగాత!

# గోరా

## ౧

శ్రావణమాసమందలి యొకనాటి ప్రాతఃసమయమునఁ గలకత్తానగరమున ఘనాఘనవినిర్ముక్తమగు నాకాశము నిర్మలబాలాతపకాంతులచే విరాజిల్లుచుండెను. అప్పుడు పనియేమియు లేకయున్న వినయభూషణుఁడు తనసౌధమున రెండవయంతస్తునందలి వరాండాలో నొంటిగ నిలువఁబడి వీథివెంట వచ్చుచుఁ బోవుచుండువారిని గనుంగొనుచుండెను. కాలేజీ చదువు చాలదినములక్రిందటనే పూర్తియైనను నాతఁ డింకను సంసారమధ్యమునఁ బ్రవేశింపలేదు. ఆతనికి సభలను సాగించుటయందును, వర్తమానపత్రికలకు వ్రాయుటయందును మనసున్నది గాని యంతగా వానియందుఁగూడ శ్రద్ధపూర్తిగా లేదు. అందుచేతనే నేటియుదయమున నాతని కేమి చేయుటకుఁ దోఁచక చంచలహృదయముతో నటు నిటుఁ జూచుచుండెను. అప్పుడు పరవశుఁడైయున్న హారిదాసుఁ డొకఁడు చెంగటనున్న యంగడి కెదురుగ నిలువఁబడి యీ క్రిందివిధముగ గానము చేయుచుండెను.

"అపరంజి గూటిలో, నంతలోనే తోఁచి యపురూపమై పోవుచిలుకా!
ఎపుడు వచ్చెదవో నీవెపుడు పోయెదవో ని [illegible] చిలుకా!
జీవరత్నమువోలి నీవెప్పుడైన, నా చేతి కందితివేని చిలుకా!
భావసూత్రంబుతోఁ బట్టి నీపాదాల బంధించివైతునే చిలుకా!"

ఆహారిదాసునిఁ బిలిచి యాచిలుకపాటఁ బూర్తిగఁ బాడించి [illegible] యునని వినయునకుఁ గోరిక కలిగెను; కాని, రాత్రి యంతయును జలిగా నుండుటచే గప్పుకొన్న దుప్పటమునైనను దొలఁగించుట కిష్టము లేనంతటిబద్ధకముగా నుండుట వలన నాతఁ డాగీతమును వ్రాసికొనఁజాలకపోయెను. కాని యాగీతస్వర మాతని హృదయమధ్యమున బ్రతిధ్వనించుచునే యుండెను.

అప్పు డాతనియింటి కెదురుగా వీథిని బోవుచున్న యొకయద్దెబండిపై బలమైన జోడుగుఱ్ఱములబండి యొకటి పడుటచే బండిచక్రము విరిగిపడిపోయెను. గుఱ్ఱపుబండి యతివేగముగ నదృశ్యమైపోయెను. అద్దెబండి పూర్ణముగా బోరగిలఁబడలేదు; కాని యొకప్రక్కకుమాత్ర మొరగిపోయెను. అది చూచి వినయభూషణుఁడు త్వరముతోఁ గ్రిందికి దిగి వీథిలోనికి వచ్చెను. అప్పటి కాబండిలోనుండి పదునేడు పదునెనిమిదేండ్ల వయసుగల యొకయువతీరత్నము మెల్లగా దిగియెను. మఱియు లోపలనున్న పెద్దమనుష్యుఁడగు నొకవృద్ధుఁడు దిగుట కుపక్రమించుచుండెను. వినయభూషణుఁ డావృద్ధునిఁ బట్టుకొని మెల్లగాఁ గ్రిందికి దింపెను. అప్పు డావృద్ధునివదనము వివర్ణమైయుండుటం గాంచి వినయుఁ డాదరముతో "అయ్యా! మీకు దెబ్బ తగిలినదా?" అని ప్రశ్నించెను.

వృద్ధుఁడు లేదని చెప్పుచు నించుక మందహాసము తెచ్చుకొనఁ బ్రయత్నించెను గాని యానవ్వంతలోనే విలీనమైపోయి యాతఁడు మూర్ఛిల్లుటకు సిద్ధముగా నుండెను. వినయుఁ డావృద్ధుని బట్టుకొని యుత్కంఠితుఁడయి చూచుచున్న యాసుందరిని గాంచి "తలుపులు తీయుఁడు! లోపలికిఁ బోవుదము!" అనియెను.

తోడనే వినయుఁ డావృద్ధుని లోపలికిఁ దీసికొనిపోయి యొకపర్యంకముపై శయనింపఁజేసెను. అనుపమసుందరి యప్పు డాగదినంతను పరిశీలించి యొకమూల నున్న జలకలశమును గాంచి యందుండి నీళ్ళ నొకగ్లాసుతోఁ దెచ్చి యావృద్ధుని ముఖముపైఁ జల్లి చల్లగా విసరుచు వినయభూషణుని గాంచి "వైద్యుఁ డెవ్వఁడైన దొరకునా?" అని ప్రశ్నించెను.

ఆయింటికి సమీపముననే యొక డాక్టరుండెను. వినయుఁ డాతని దీసికొని వచ్చుటకై యొక సేవకునిఁ బంపించెను. ఆగదిలో నొకబల్లపై నొకయద్దమును, దలనూనెసీసాయును, దలదువ్వుకొనువస్తువులు నుండెను. వినయుఁ డాయువతి వెనుక నిలువఁబడి యద్దములో నామెవదనప్రతిబింబమును దదేకదృష్టితోఁ గాంచుచు స్తంభీభూతుఁడై యుండెను. అతఁడు చిన్నతనమునుండియుఁ గలకత్తాయందే యుండి చదువుకొనుచుండెను. అతనికి గల లోకజ్ఞాన మంతయును బుస్తకములవలనఁ గలిగినది మాత్రమే. సంబంధము లేని యొప్పుడుంటియాడువాండ్రతో నాతఁ డిదివరకెన్నఁడును గలిసి యుండలేదు.

ఆయద్దములో నాతఁ డారమణీమణి మనోహరవదనమండలమును గాంచుచుండెను. ఏమి యారామణీయకము! అతని చూపులలో నాసుందరి వదనసౌందర్యమున శృంగారరేఖలను విభజించి చూడవలయునను నుద్దేశము లేదు.

కేవలమును బ్రహ్మానందముచే నించుక వంగియున్న యారమణీయతరుణముఖకమలమందలి లావణ్యసౌకుమార్యము లాతనిదృష్టులకు సృష్టియందలి సత్యఃప్రకాశితమగు నొకనూతనవిస్మయము నాపాదించుచుండెను.

కొంతసేపటి కావృద్ధుఁడు మెల్ల మెల్లఁగఁ గన్నులను విచ్చి "అమ్మా!" అని యొక నిట్టూర్పు విడిచెను. అప్పు డాయువతి కన్నుల నీరునిండఁ దన మొగము నాతని మొగమునొద్దఁ జేర్చి పేరమార్ద్రస్వరముతో "బాబా! మీకెక్కడ దెబ్బ తగిలినది?" అనియెను.

"నే నెక్కడకు వచ్చితిని?" అని పలుకుచు వృద్ధుఁడు మెల్లఁగ లేచి కూర్చుండుటకుఁ బ్రయత్నించెను. అంతలో వినయుఁ డాతనియొద్దకు వచ్చి "అయ్యా! మీరు లేవవలదు. ఇంచుక విశ్రమింపుఁడు. ఇంతలో డాక్టరు వచ్చును!" అనియెను.

అప్పుడు వృద్ధునకు బాగుగ స్మృతి కలుగుటచే "నాతలపై నీభాగమున నించుక వేదనగా నున్నది; కాని యంతవిశేషబాధ యేమియును లేదు" అనియెను.

అంతలో బాదరక్షశబ్దముతో డాక్టరచ్చటికి వచ్చి రోగాస్పదుని బరీక్షించి "ఏకేపాపాయ కేమియు నేమియు లేదు. కొంచెము వేడిపాలలో నించుక బ్రాందిని జేర్చి త్రాగింపవలెను!" అని చెప్పి వెడలిపోయెను. అంతట వృద్ధుడు అతిసంకోచితుడై తమతో విసుగుడయ్యెను. ఆసుందరి వృద్ధుని భావమును గ్రహించి "బాబా! ఏల సంకోచించెదరు? డాక్టరు వచ్చినందులకును, మందులకును గావలసినసొమ్ము మన యింటికిం బోయి పంపించివేయుదము!" అని పలుకుచు నామె వినయభూషణుని మొగమువంక విలోకించెను.

ఆహా! ఏమి యాశ్చర్యవిలాసము! ఆకన్నులు పెద్దవియా చిన్నవియా, నల్లనివా యెఱ్ఱనివా యను వితర్కము మనసునకుం దోపించుటకు లేదు! చూపులయందు నొకయ సందిగ్ధభావము నిర్భయముగానున్నట్లు ప్రతిభయొక్కయునునే పొడకట్టుచుండెను. ఆదృష్టులయందు నెట్టిసంకోచమును లేదు. ఎట్టిద్వైధీభావమును లేదు. కేవలము నవి యేకమాత్రస్థిరశక్తిసంపన్నములై యుండెను.

వినయభూషణుడు ప్రయత్నపూర్వకముగ మాటాడుట కుపక్రమించి "వైద్యున కిచ్చునది స్వల్పము. అందుకొఱకు- అది మీరు- అది నేను" అనియెను. ఆసుందరి యాతని మొగమువంకనే చూచుచుండుటచే సరిగా నాతడు మాటాడజాలకపోయెను. కాని వైద్యునకుం గొంతసొమ్మీయవలసి యుండునను సంగతిమాత్రము నిస్సంశయముగాం దెలిసిపోయెను.

అప్పుడు వృద్ధుడు "నాకు బ్రాంది యక్కఱ లేదు" అనియెను. ఆ యువతి యా మాట కడ్డమువచ్చి "ఏమి బాబా! డాక్టరుగారు చెప్పినట్లు చేయవలదా?" అనియెను.

వృద్ధుడు "ఇప్పటి డాక్టరులకిది దురభ్యాసమైపోయినది. నానొప్పి వేడి పాలు త్రాగినచో తగ్గిపోవును." అని చెప్పి యాతడు పాలనుమాత్రము త్రాగి యించుక విశ్రాంతినంది వినయభూషణుని గాంచి "ఇంక మేము పోయెదము- మీకుం జాలశ్రమ కలిగించితిమి" అనియెను. తోడనే యాసుదరి వినయునివంకం జూచి "ఒకబండి" అనియెను. వృద్ధుడు సంకోచముతో "ఆయన కింకను దొందర కలిగించుటయేల? మనయిల్లు సమీపమే కదా! ఒకనిమిషములో బోవుదము!" అనియెను. అంత నా రమణీమణి "వలదు బాబా! మీరు నడువజాలరు" అనియెను.

వృద్ధుడేమియు మాటాడలేదు. వినయుడు స్వయముగంబోయి బండిని దీసికొని వచ్చెను. బండి నెక్కుటకుముందే వృద్ధు డాతనిం గాంచి "మీ పేరేమి?" అని ప్రశ్నించెను.

వి.—నా పేరు శ్రీ వినయభూషణచట్టోపాధ్యాయుడు.

భోజనమునకుఁ బ్రారంభించెదవు. క్రమముగా బ్రాహ్మసమాజపుపట్టీలోఁ బేరు వ్రాయించుకొని యొక్కసారిగా దిగ్విజయప్రచారకుఁడ వయ్యెదవు!" అనియెను.

వినయ—ఏమనుచున్నావు ? తరువాత ?

గోరా—తరువాత నేమున్నది ? వచ్చినను గౌరవము లేదుగదా! బ్రాహ్మణకులమునఁ బుట్టి జంతువుంబోలి చావవలయును. ఆయాచారవ్యవహారము లన్నియుఁ బోవును. దిక్ప్రదర్శనయంత్రము లేని యోడవలె నీకు దిక్కు తెలియకుండఁబోవును. అప్పుడు నీవు, నౌక యొడ్డునకుఁ జేరుటయే కుసంస్కార మనియును సముద్రమధ్యమునఁ గేవలమును దేలిపోవుటయే స్వభావగమనమనియును దోఁచును. కాని నాకీవిషయమునఁ బూర్వముగాఁ దెలుపుటకు ధైర్యము చాలదు. ఇంతయేల? నీవు వెళ్లుము. అధఃపతనమున కభిముఖుఁడవై నిలిచియుండి నన్నింక యేల భయపెట్టెదవు?

వినయుఁడు మందహాసము చేయుచు "వైద్యుఁడాశ వదలుకొన్నచోటుల నెల్ల రోగి మరణించుటకలుగదు. ఇప్పుడంతటి వినాశకాలసూచన లేవియు నగపడుటలేదు" అనియెను.

గోరా—లేదా ?

వినయ—లేదు.

గోరా—నాడి చెదరిపోవుట లేదా ?

వినయ—లేదు. దివ్యముగా నున్నది.

గోరా—స్త్రీహస్తముచే స్పృశింపఁబడినంతమాత్రమున మ్లేచ్ఛాన్నము దేవతానివేదనమున కర్హము కానేరదని నీమనసునకుఁ దోఁచుట లేదా ?

వినయుఁడు విరక్తిభావముతో "గోరా! ఇఁకఁ జాలింపుము. కూరుచుండుము!" అనియెను.

గోరా—నామాటలోఁ దప్పేమున్నది ? స్త్రీహస్త మెందుకన్న నంటఁగనిది కాదు. పురుషకరస్పర్శము చేసిన యాపవిత్రకరపల్లవము పేరెత్తుటయే నీకుఁ గష్టముగా నున్నది.

వినయ—గోరా! నాకు స్త్రీజాతియందు భక్తి గలదు. మనశాస్త్రములును—

గోరా—స్త్రీజాతి నెట్లు భజింపవలయునో యాశాస్త్రములే చెప్పుచున్నవి గాదా! అది భక్తిగాదు—అట్లన్నచో వెంగముపై నుమియుదురు.

వినయ—నీవు కేవలమును మొండివాదము చేయుచున్నావే !

గోరా—స్త్రీలనుగుఱించి "పూజార్హా గృహదీప్తయః" అని శాస్త్రములు చెప్పుచున్నమాట నిజమే—ఏమనిన—వారు గృహములను బ్రకాశింపఁజేయువారు గావున—పురుషుల హృదయములను బ్రకాశింపఁజేయుదురు గావున వారు పూజార్హులని చెప్పు పాశ్చాత్యసాంప్రదాయము కేవలము నింద్యమైనది.

విన—అక్కడక్కడ లోపము లగపడినంత మాత్రమున నుత్తమపద్ధతుల నీవిధముగా విమర్శింపవచ్చునా ?

గోరా—(తెల్లపోయి) వినయా ! నీకాలోచనాశక్తి శూన్యమైపోయినది. అందుచేతనే నామాట తలకెక్కకున్నది. విదేశసాంప్రదాయమున స్త్రీలనుగూర్చి చెప్పిన యత్యుక్తులన్నియును కేవలమోహసంపూర్ణములైనవి. విశ్వమందిరమున గృహిణీపీఠము నలంకరించియున్న శ్రీగౌరీసరస్వతులుమాత్రమే పూజార్హలు. ఆ మెట్టునెక్కి యీభావము వచ్చినతరువాత స్త్రీలను గురించి కావించు స్తుతిభాషణము లన్నియు దూషణములే కాని వేఱుకావు. ఎందుచేత నీమనసు పక్షివలె యెగిరిపోయి పరేశబాబుగృహము చుట్టును తిరుగుచున్నదో, యాభావమునే యింగ్లీషుభాషలో "లవ్" అని చెప్పుదురు—దానినే యింగ్లీషువారి ప్రపంచమునందలి పరమపురుషార్థముగా భావించుచుందురు. నీవిట్టి చిక్కులలోఁ బడకుందువు గాక !

వినయుఁడు చబుకుదెబ్బ దిన్న క్రొత్తగుఱ్ఱమువలె నెగసిపడి "గోరా ! ఇంకఁ జాలింపుము. మితి మించిపోవుచున్నది !" అనియెను.

గోరా—మించుట కేమున్నది ? ఏమియును లేదు. స్త్రీపురుషులపరస్పరసంబంధము మనోవికారమూలకముఁ గారణ మని మన మెన్ని యింగ్లీషుపుస్తకములలోఁ జదువలేదు !

విన—ఓహో ! బాగుగ నీ గ్రహించితివి. స్త్రీపురుషసంబంధ మెట్లుండవలయునో యట్లుండనీయక మోహావేశముచే నియమోల్లంఘనము చేసినచో నది యనర్థదాయక మేయగును. ఈయపరాధ మెక్కడి జాతీయులదిమాత్రమేనా ? ఈసంబంధమున నింగ్లీషువారికవిత్వము మిథ్యయైనచోఁ గామినీ కాంచనములఁ బరిత్యజించుటయే సర్వవిధముల శ్రేయోదాయక మని చెప్పిన మనవారికవిత్వమును మిథ్యయే! మానవహృదయములు కాంతాకనకములయెడల మోహముగ్ధలైపోవుట స్వభావము. అందుచేతనే నీతిబోధకులగు కొందఱుకవులు స్త్రీయందలి సౌందర్యాంశమునుమాత్రమే సముజ్జ్వలముగ వర్ణించి మోహమును నిందించియున్నారు. మఱికొందఱు కవులు మోహపరిపూర్ణములగు కామినీకాంచనములు కేవలము పరిత్యాజ్యము లనియే విధించియున్నారు. ఈరెండును నిరుదెఱఁగు లగు భిన్నప్రకృతుల భిన్నపద్ధతులు. ఇందొకదానిని మాత్రమే మోదించి రెండవదానిని తిరస్కరించుట సమంజసము కాదు.

గోరా—కాదు నీవు పొరపాటు పడుచున్నావు. నీమనస్స యింతవఱకు మారిపోయినది. అంతటి వేదాంతము నీతలలో నున్నప్పుడు నీవు నిర్భయముగా "లవ్" చేయవచ్చును. కాని సమయము వచ్చినప్పు డట్టిభావము నడంచుకొను సామర్థ్యముండవలయును. ఇదియే మనసామాజికనియమము.

విన—(స్మితహృదయముతో) గోరా! నీకు మతిపోవుచున్నదా! ఇంకను నాకు "లవ్" అనియెదవేమి? కాని నేనొక్కమాట యంగీకరించెదను. నేను పరేశబాబును జూచి యాతని సంగతి తెలిసికొన్నప్పటినుండియు నాకు వారియందు గౌరవము కలిగినది. అందుచేతనే వారి జీవితచరిత్రము నెరిగికొనవలయునని నాకుఁ గోరిక కలుగుచున్నది.

గోరా—మంచిమాటయే. అట్టికోరికలనే యడంచుకొనవలయును. నీవెంత ప్రయత్నించినను వారి జీవితచరిత్రమునం దొక్కయధ్యాయము నైనను ముగింపఁజాలవు. వారు కేవలమును ప్రార్థనాపరులు. నీవు వారి నీతిగతులనుగూర్చి ప్రయత్నించుటకుఁ గడంగితివేని నీకుఁ దుదకు వారి యనుజ్ఞాపత్రము లేకుండ దర్శనము చేయుటకుఁ గూడ నవకాశము లేకుండఁబోవును.

విన—నీయందున్న గొప్పదోషమే యిది. పరమేశ్వరుఁడు సర్వశక్తులను నీకొక్కనికే ప్రసాదించెననియు, తక్కిన మావంటివారందఱును కేవలము దుర్బలులనియు నీయభిప్రాయము!

గోరా కీమాట క్రొత్తగాఁ దోఁచెను. అందుచే నాతఁ డుత్సాహముతో వినయుని వెన్నుపైఁ జరచుచు "మిత్రమా! సరిగాఁ జెప్పితివి! ఇదియే నాయందున్న దోషము!" అనియెను.

విన—కాదు. నీబుద్ధియం దింతకంటెను మఱియొకదోష మున్నది. పరులనెల్లప్పుడును దిరస్కరించుచుండుటయే కాని వారియందలి మంచితనమును గ్రహించు నుద్దేశము నీకెంతమాత్రమును లేనేలేదు.

వారిట్లు సంభాషించుకొనుచుండఁగా గోరాసవతియన్నయగు మహిముఁడు లంబశరీరము కలవాఁడగుటచే వగర్చుకొనుచు మేడమీఁది కెక్కివచ్చి "గోరా!" అని పిలిచెను. గోరా తత్తరముతో లేచి నిలువఁబడి "ఏమి సెలవు?" అనియెను.

మహి—విశేషములేమి? వర్షాకాలమేఘము లన్నియు మనమేడమీఁదనే యలముకొని గర్జించుచున్నట్లగపడుచున్నది. ఇంగ్లీషు తెలిసికొని భారతసముద్రమున సముదూరము దాఁటితివా? ఇంగ్లీషునకు లోపములేదు; కాని క్రిందిగదిలోఁ దలనొప్పితోఁ బడియున్న మీవదినెకు నీసింహనాదము దుస్సహముగా నున్నది.

అని చెప్పి యాతఁడు దిగిపోయెను.

## 3

గోరాయును వినయుఁడును మేడదిగుట కుపక్రమించుచుండఁగా గోరాతల్లి పైకి వచ్చెను. తోడనే వినయుఁ డామెకుఁ బ్రణామంబు చేసి యామె పాదధూళిని శిరంబునఁ దాల్చెను. గోరాతల్లి యగు నానందమయిని జూచినచో నామె గోరాతల్లి యని యెవ్వరు ననుకొనరు. ఆమె సన్నముగాఁ బలుచగా నమోన్నతముగా నుండును.

ఆమె కుంతలము లందందు నరసియున్నను పైకిమాత్రము స్పష్టముగా నగపడుటలేదు. ఆకస్మికముగఁ జూచినచో నామె నలువదియేండ్లకు లోఁబడినవయసుగలదానివలె నగపడును. ఆమె వదనమండల మతిసుకుమారమైనది. నాసికయు, నోష్ఠాధరములును జుబుకమును, లలాటమును దిద్ది తీర్చినట్లుండును. ఆమెయంగంబుఁ దేజోమయంబగు బుద్ధిశక్తి యెప్పుడును దాండవించుచుండును. ఆమె శ్యామలాంగి. గోరాశరీరచ్ఛాయతో నామెను బోల్చుట కెంతమాత్రము నవకాశములేదు. ఆమెను జూచినంతమాత్రముననే యొకవిధమగు గుఱింత కలుగును. ఆమె లంగాయును, గమీజును ధరించును. పూర్వకాలమునాఁటి కప్పటినవనాగరికయువతు లందరు దక్షిణదుస్తులను ధరించుచుండిరి. ధరించుటయున్నదిగాని చాలమందియిల్లాం డ్రట్టివారిని కిరస్తానీలని నిందించుచుండిరి. ఆనందమయిభర్త కృష్ణదయాళుఁడు కమీషనరుపని చేసెను. చిన్నతనమునందే యామె యాతనితోఁగలసి పశ్చిమదేశ మంతయును దిరిగివచ్చెను. అందుచేతనే యామె కట్టిదుస్తులనుధరించుట కెట్టిసంశయమును లేకుండఁబోయెను. సామాన్యగృహిణివలె నామె యింటిపనులను జేయుచు, బంధువులతో భాషించుచుఁ, బొరుగిండ్లకుఁ బోవుచు నీవిధముగాఁ బ్రొద్దుపుచ్చుకొను స్వభావము కలదికాదు.

ఆమె మేడమీఁదికివచ్చి "గోరా! నీకేకలు క్రిందికిఁగూడ వినఁబడునంతటి యుచ్చస్వరపూరితములై యుండుటచే వినయుఁడు వచ్చియుండునని నేనప్పుడే యనుకొంటిని. చాలదినములనుండి యిల్లంతయు నిశ్శబ్దముగా నున్నది. ఏమి బాబూ! వినయా! వచ్చుటలేదేమి? అనారోగ్యముగ లేదుగద?" అనియెను.

విన—లేదమ్మా! వర్షాకాలముగదా!

గోరా—అమ్మా! యిఁటివా యీతనిప్రత్యుత్తరము! ఈవర్షాకాలము పోయినచో నెండకాలము వచ్చెననును! ఊరక దేవతలపై దోషారోపణము చేసినచో వారు ప్రత్యుత్తరము చెప్పరుగదా! మనసులోనియుద్దేశ మాయంతర్యామి యొక్కఁడే తెలిసికొనఁగలఁడు.

విన—గోరా! నీమాటల కర్థములేదు.

ఆనం—వినయా! ఆమాట నిజమే బాబూ! నేనందుకొఱకుఁ జెప్పుటలేదు. మానవహృదయము లొకప్పుడునిర్మలములుగను,మతియొకప్పుడు కళంకితములుగను నుండును. కాని యెల్లప్పుడు నేకరీతిగానుండవు. ఈవిషయముగూర్చి చెప్పవలసివచ్చినచో నెంతయో యున్నది. వత్సా! రమ్మా! లోనికిరమ్మా! తినుటకేమైనఁ బెట్టెదనురమ్మా!

గోరా తీవ్రముగఁ దల నడ్డముగఁ ద్రిప్పుచు "వలదు! వలదు! అట్లెన్నటికిని జరుగదు! వినయుని నీయింటిలో నేమియును దిననీయను" అనియెను.

ఆనం—ఔను బాబూ! నిన్ను నేను దినుమని చెప్పలేదు. నీతండ్రి శిష్టాచారసంపన్నుఁడు! స్వయముగ వండుకొనిగాని భుజింపఁడు! వినయుఁడు నాప్రియపుమా

ఆనం — ఏమంటివి? నాకుఁ గోపమా? నీవు చేయునది లేవియును జ్ఞానముతోఁ జేయుటలేదని చెప్పుచున్నాను. నేను నిన్ను, పెంచి పెద్దవానిఁ జేసితిని. ఏమైననేమి— నీయందేమునందు నాకింతమాత్రమును గౌరవము లేదు. అట్లయిన నాకుఁ గష్టముగా నున్నది. ఎప్పుడు నీవు నాయింటిలోనుండి నా చేతులలో వినాశింపఁబోయినను నీవు ప్రతిదినమును ప్రాతఃస్నానము కాలమున వచ్చి నాకన్నులఁ బడుచున్నచో నదియే నాకుఁ బరమానందము. వినయా! అట్లు బిక్కమొగము వైచికొని యుంటివేమి బాబూ! నీ మనసు మిక్కిలి మెత్తనిది. నాకుఁ గష్టముగా నున్నదనుకొంటివి కాఁబోలును? లేదు నాయనా! మఱియొకప్పుడెప్పుడైన నిన్నుఁ బిలిచి మంచి బ్రాహ్మణునిచేత నే వంట చేయించి పెట్టెదను లెమ్ము! నీవు మఱియొకలా గనుకొనఁగలదు. నేనుమాత్రము మాలక్ష్మి నాపి చేతియన్నము సేవించెదను.

అని చెప్పి యామె క్రిందికి దిగిపోయెను. వినయుఁడు కొంతసేపటివఱకు మౌనముతో నిలువఁబడి పిదప మెల్లమెల్లగా "గోరా! నీవెఱ్ఱి చాలవఱకు ముదిరిపోయినది." అనియెను.

గోరా — అణుమాత్రమైనను లేదు. ఎవ్వరి మతమును వారు నిలుపుకొనుటకుఁ బ్రయత్నించుచుందురు. లోకమున కేమాత్రమును సందేహించినను క్రమముగ నంతయును జెడిపోవును.

విన — ఆహా! ఏమితల్లి !!

గోరా — ఆసంగతి నీవు బోధింపనక్కఱలేదు. నాకును దెలియును! నాతల్లివంటి తల్లి యెవ్వరికిని లేదు. కాని యాచారమును పాలింపనప్పుడు తల్లినైనను నేనొక్కనాఁటికి గౌరవింపను. చూడుము వినయా! నీకొక్కటే మాట చెప్పుచున్నాను. మనసునందుంచుకొనుము. హృదయము తృప్తమైనదే కాని సర్వోత్తమమైనదిమాత్రము కాదు.

విన — గోరా! ఇప్పటి యమ్మమాటలవలన నామనసున కేమో తల్లడముగా నున్నది. ఆమె తనమనసులోని యుద్దేశమును మనకుఁ దెలుపఁజాలనందులకుఁ జింతిల్లుచున్నట్లు గనపడుచున్నది.

గోరా యించుకయధీరుఁడై "వినయా! అంతదూరముగా నాలోచింపవలదు. అందువలన వృథా కాలహరణమే గాని లాభము లేదు" అనియెను.

విన — మిత్రమా! నీవిప్రపంచమునందలి యెట్టియు వస్తువునైనను మంచి కంటితోఁ జూడఁజాలవు. ఇంతేకాక కల్పనాబలముచే నీవు చూడనివస్తువునుగూడఁ దిరస్కరించుచునే యుందువు. అమ్మ యేదుచేతనో గాని వ్యస్తహృదయయైనట్లున్నది. ఆమె కేదియో గృహసంబంధమగు చింతగూడ యుండును. గోరా! నీవామె చెప్పిన మాట వినఁగూడదా?

గోరా — వినవలసినంతవఱకు వినియే యుంటిని. ఇంకను విననలఁచినచో, పెద్దమాటలుగూడ వినవలసివచ్చునని యూప్రయత్నము మానుకొంటిని.

## ౪

మతప్రసిద్ధమగు నొక యుపదేశము నెంతతీవ్రముగ నిచ్చెనో యంతతీవ్రముగ దానిని మానవులయెడల బ్రయోగించుపట్టున నల్లసమయములందును ధైర్యమును వహింపజాలదు. విశేషించి వినయునకడ నట్టి ధైర్యములేదు. వినయుని హృదయము ప్రవృత్తి యతిప్రబలమైనది. అందుచేతనే యాతడు మతవర్చ చేయుపట్టున మతమే సర్వోత్తమమైనదని వాదించుచుండును, కాని వ్యవహారసమయములయందు మానవులనంతకంటెను విశేషముగ గౌరవింపకుండ నుండజాలడు. గోరాచే బ్రచారితములగు మతపద్ధతులలో నెన్నిటిని వినయుడు మతమునందలి గౌరవముచే స్వీకరించుచుండెనో, యెన్నిటిని గోరాయందలి ప్రీతిచే గౌరవించుచుండెనో చెప్పుటకష్టము.

అపరాహ్ణసంధ్యాసమయమగుటయు గోరా యిలువిడిచి పంకిలమగు మార్గమున మెల్లగా వినయునింటికి బోవుచుండెను. అప్పుడాతని హృదయమున మతము, మానవుడు నను రెండు విషయములను గూర్చి చర్చజరుగుచుండెను. కాలము ననుసరించి ప్రకాశముగనో, గూఢముగనో శత్రుసింహము పలు నానావిధములగు నాఘాతములనుండి సమాజము సంరక్షింపజాలినచో, నాహారవిహారాది విషయములందును యితము విశేషించి జాగ్రత్తగా నుండవలయునని గోరా వినయునకు బోధించియుండెను. వినయుడు దాని నతిసులభముగనే గ్రహించెను. ఆ యుపదేశమునకు విరుద్ధముగా నున్నవారితో గోరా యతితీవ్రముగ వాదించియుండెను. శత్రువులు కోటను ముట్టడించినప్పుడాత్మసంరక్షణమునకై కోటబురుజుల ప్రవేశమార్గములను, సందులను, ద్వారములను, కిటికీలను, రంధ్రములను బంధించి కాపాడుట యౌదార్యమునకు లోపము కాజాలదని యాతడుపదేశించియుండెను. కాని నేడు తల్లియగు నానందమయియింట భుజించుటకై గోరా యడ్డగించుట వినయునకు హృదయాఘాతమై యాంతరిక వేదనను గలిగించుచుండెను.

పాపము వినయునకు దండ్రి లేడు; తల్లి చిన్నతనమునందే మరణించినది; పినతండ్రి మాత్రము స్వదేశమునందుండెను. వినయుడు చిన్నతనమునుండియు గలకత్తాయందే యొంటరిగా నుండి చదువుకొని పెద్దవాడయ్యెను. గోరాతో స్నేహము కలిగినప్పుడే యాతని కానందమయి వాత్సల్యము లభించినది. అప్పటినుండియు వినయుడామె నమ్మాయని పిలుచుచుండెను. వినయుడు తఱచుగా నానందమయియింటికి బోవుచు నామెయొద్దనుండి తనకు గావలసిన వస్తువులను బలవంతముగ దీసికొని తినుచుండెడివాడు; ఆమె తనకును గోరాకును వడ్డించుసమయమున "నీవు పక్షపాతము చేయుచున్నావు" అని యామెపై గృత్రిమకోపమును జూపుచుండెడివాడు. తానొకటి రెండుదినములు రాకుండినచో నానందమయి తనకొఱకెంతయాత్రపడుచుండెడిదో, వచ్చినప్పుడు చెంతగూర్చుండి తనకు భోజనము పెట్టుటకామె యెంత వేచియు

పడుచుండినదో, సభ ముగించి యెప్పుడు వచ్చునా యని యామె తనకొఱకెట్లు నిరీక్షించుచుండెడిదో వినయునకు బాగుగఁ దెలియును. అట్టివినయుఁ డిప్పుడు సామాజిక నియమముల ననుసరించి తనయింట భుజింపకుండుట యానందమయి సహింపఁగలదా? వినయుఁడు మాత్రము సహింపఁగలఁడా ?

“ఇంతటినుండి నీవు మంచి బ్రాహ్మణునిచే వండించి పెట్టెదను. ఇఁక నెన్నఁడును నాచేతియన్నము నీకు బెట్టను లెమ్ము!” అని నగుమోముతోఁ దల్లి చెప్పినది. కాని యీపలుకు హృదయశల్యము గాదా! ఈమాటనే వినయుఁడు సారెసారెకు మనంబున భావించుకొనుచు నిల్లు చేరుకొనియెను.

ఆశూన్యమందిర మంధకారమయమై యుండెను. నలుదెసలఁ గాగితములును, పుస్తకములును గత్తరగాఁ బడియుండెను. వినయుఁ డగ్గిపుల్లతో దీపమును వెలిగించెను. అతని వ్రాతబల్లపైఁ గప్పఁబడిన తెల్లనిబట్టపై సిరాయుఁ జమురుడాగులు పడియుండెను. ఆయింటిలో నాతనిప్రాణములు కొట్టుకొనిపోవుచుండెను. మానవసంఘమును, స్నేహభావము ననుభవయము లిప్పు డాతనిహృదయమున మఱచిత్రములై యుండెను. దేశోద్ధరణము సమాజరక్షణము నను సమస్తకర్తవ్యములు నేమితమునందును, స్వప్నములుగను, సత్యములుగను, నాతని కగపడుటలేదు. ఒకనాఁటి శ్రావణనిర్మలప్రభాత సమయమునఁ బంజరమునొద్దకు వచ్చి మరల నాపంజరమునుండి వెడలిపోయిన యాచిలుకయే యాతనికిఁ బ్రత్యక్షసత్యముగాఁ గానవచ్చుచుండెను. ఆయజ్ఞాతవిహంగినిం గూర్చి యాతనిహృదయమునం దింకను యెట్టియాలోచనయుఁ బుట్టలేదు. కాని యింతకు ముందే గోరా తన్నుఁ బ్రవేశింపకుండఁజేసిన యానందమయుమందిరప్రతిబింబమే యాతనిహృదయమునం దంకితమై యుండెను.

ఆగది యందలి చలువరాతినేల మిలమిల మెఱయుచుండెను. ఒక సోఫాపై రాయంచ ఱెక్కలంబోలి తెల్లని మెత్తని పాన్పు పఱుపఁబడియుండెను. దానిప్రక్కనున్న చిన్నబల్లపై దీపమింకను వెలుఁగుచునే యుండెను. ఆదీపమునొద్ద నిజముగా నానందమయి వన్నెవన్నెలదారములను గైకొని యొకకంబళిమీఁదఁ జిత్రశిల్పమును గావించుచుండెను. దాని లక్ష్మి క్రిందనొకపీటపైఁ గూర్చుండి యొక్కటే ధోరణిగా నేమేమియో మాటలాడుచుండెను. చాలభాగ మానంద యామాటలను వినుచుండుటయే లేదు—తల్లియగు నానందమయి మనసునకుఁ గష్టముగా నున్నప్పుడెల్ల కుట్టుపనిలో మగ్నయగుచుండును. అట్టిపనిలో నిమగ్నయై యున్న యామె ప్రసన్నవదనమండలమే యిప్పుడు వినయునిమనోనయనములకు గోచరించుచుండెను. అప్పు డాతఁడు తనలో “ఈవదనమునందలి ప్రేమతేజమే నామనోవైకల్యమును బాఱఁదోలి నన్ను రక్షించుఁగాక! ఈపవిత్రముఖమండలమే నామాతృభూమి ప్రతిమాస్వరూపమగుఁగాక! ఇదియే నాకుఁ గర్తవ్యకార్యప్రేరకమగుఁగాక! ఇదియే నన్ను స్వధర్మనిరతుని గావించుఁగాక!”

అని యనుకొనుచు మనసునందే యామెంగూర్చి యొకసారి "అమ్మా!" యని పిలిచి "అమ్మా! నీయన్నము నాకమృతము కాదని యెట్టిశాస్త్రములు సప్రమాణముగ నిరూపించినను నేను విశ్వసింపను" అనియెను.

నిశ్శబ్దముగనున్న వినయుని గృహమునందలి పెద్దగడియారము టిక్కు టిక్కు మనుచు నేయుండెను ఆయింటి సంకట యాతనికి దుస్సహ మయ్యెను. దీపమునొద్ద గోడపై నుండి యొకబల్లి పురుగును బట్టుకొనుచుండెను. వినయుఁడు దానివంక నించుక సేపు చూచిచూచి చటాలున లేచి గొడుగుఁ దీసికొని వెలుపలికి వచ్చెను. ఏమి చేయవలయునో యాతఁడు నిశ్చయించుకొనలేదు. మరల నానందమయినొద్దకుఁ బోవలయు ననియే యాతని యభిప్రాయ మైయుండును. కాని యాకస్మికముగా నాతనికి నేఁ డాదివారమనియు, బ్రహ్మసభయందుఁ గేశవచంద్రుఁ డుపన్యసించు ననియు జ్ఞప్తికి వచ్చెను. అది తోఁచినవెంటనే వినయుఁడు తక్కినవాని నన్నిటిని మఱచిపోయి వేగముగా నడవ నారంభించెను. ఉపన్యాస మీపాటికిఁ జాలవఱకు ముగియవచ్చునని తోఁచినది గాని యాతఁడు మఱి తనయుద్దేశమును మార్చుకొనలేదు.

అతఁడు పోవునప్పటికి సామాజికు లందఱును వెలుపలికి వచ్చుచుండిరి. వినయుఁడు గొడుగు వైచుకొని యొకప్రక్కను నిలువఁబడిపోయెను. అప్పటికి పరేశబాబు శాంతప్రసన్నవదనముతో మందిరమునుండి యీవలకు వచ్చెను. అతనితో నలుగురైదుగురు పరిజనులుండిరి. వారిలో నొకతరుణమనోహరవదనమును వీథిదీపపువెలుఁగున వినయుఁ డొక్కసారిమాత్రము వీక్షించెను. తోడనే బండిచక్రముల చప్పుడయ్యెను. వెంటనే యదృశ్యమైపోయెను. వినయుఁ డింక నింటికిఁ బోక తిరిగి తిరిగి తిన్నగా గోరాయింటికిఁబోయెను. అప్పటికి సంధ్యాంధకారము సాంద్రమైపోయెను. అప్పుడు గోరా యొకదీపమునొద్దఁ గూర్చుండి యేమియో వ్రాయుచు మొగము పైకెత్తకయే "వినయా! ఇది యేమి! ఈగాలి యేవైపునుండి వచ్చినది?" అనియెను.

వినయుఁ డామాట వినకయే "గోరా! నిన్నొకమాట యడిగెదను. నీయుద్దేశమున భారతవర్షము సత్యస్వరూపమైనదేనా? స్వప్నస్వరూపమైనదేనా? రేయుంబవలు నీ వాలోచించుచుందువు గదా—ఈవిషయమున నీయభిప్రాయ మేమి?" అనియెను.

గోరా వ్రాయుట మాని తీవ్రదృష్టితో వినయునివంక నించుకసేపు తిలకించి కలము నొకచో నుంచి కుర్చీవెనుకకు మొగము ద్రిప్పి "వినయా! నావికుఁడు తన నౌకను సముద్రమున విడిచి యేపనులలో నిమగ్నుఁడైయున్నను దాను పోవు రేవును లక్ష్యమునందుంచుకొనునట్లే నేనును నాభారతవర్షమును నామనసునందు నిలుపుకొని యున్నాను" అనియెను.

విన—నీభారతవర్ష మెక్కడ నున్నది?

గోరా—గుండెలపైఁ జేయుంచి "ఈదిక్ప్రదర్శనయంత్రము (కంపసు) నిరంతరము నేవైపునకు ముల్లు చూపుచున్నదో నాభారతవర్షమచ్చటనే యున్నది. అంతే కాని మీమార్షల్ దొరగారి హిందూదేశచరిత్రలో లేదు." అనియెను.

వినయ—నీముల్లేవైపునకుఁ దిరిగి యున్నదో యచ్చట నేమైన నున్నదా ?

గోరా—లేకేమి ? నేను దారి తప్పిపోవచ్చును; మునిఁగి చచ్చిపోవచ్చును; కాని నాముల్లాయదృష్టస్థానమునే—భాగ్యలక్ష్మీస్వరూప మగునారేవునే లక్ష్యము చేయుచున్నది. అదియే నాసమగ్రభారతవర్షము! అదియే ధర్మపూర్ణమైనది; జ్ఞానపూర్ణమైనది. అట్టిభారతవర్షము మఱి యెచ్చటను లేదు. అది కానిదంతయు నలువైపుల నసత్యమే—ఈ నీకలకత్తాపట్టణము, ఈకచేరీలు, ఈకోర్టులు, ఈభవనములు-ఇవి యన్నియును బుద్బుదప్రాయములు! ఛీ!

అని చెప్పి గోరా వినయుని మొగమువంకఁ దదేకదృష్టితోఁ గొంతసేపటివఱకును జూచుచుండెను. వినయుఁ డేమియును మాటాడక భావించుకొనఁ దొడంగెను. అప్పుడు గోరా మరల నందుకొని "వినయా ! ఎచ్చట మనము చదివియుంటిమో, వినియుంటిమో, ఉద్యోగములకొఱకు కనఁబడ్డవారినెల్ల నాశ్రయించుచుంటిమో, ఇంతచేసినను కుటుంబపోషణమునకుఁ దగినంత సంపాదించుకొనుటకు దిక్కులేక యుంటిమో యిట్టి యీయైంద్రజాలికమిథ్యాస్వరూపమునే భారతవర్ష సత్యస్వరూపముగా భావించుచు నిందలి యిరువదియైదుకోట్లప్రజలును మిథ్యాగౌరవమును గౌరవముగను, మిథ్యాకర్మమును సత్కర్మముగను నెంచుకొనుచు విభ్రాంతులై సంచరించుచున్నారు. ఇట్టి మరుమరీచికామధ్యమునందేయుండి యెట్లో మనమందఱమును బ్రాణములను నిలుపుకొనఁ గలుగుచున్నాము. అందుచేతనే నానాఁటికిఁ గృశించి పోవుచున్నాము. సత్యభారతవర్షమొకటి యున్నది. అదియే పరిపూర్ణభారతవర్షము! అందుండుభాగ్యమే లభింపకున్నచో మన మేజ్ఞానముతో, నేహృదయముతో సత్యజీవామృతమును గ్రోలఁగలుగుదుము ? అందుచేతనే సర్వమును మఱచిపోవలయునని చెప్పితిని. బిరుదుచదువులు బిరుదుమాయలు, ముష్టిమోహములు సర్వమును ద్రోసివైచి మనయోడ నారేవున కభిముఖముగా నడిపింపవలయును. మునిఁగిన మునుఁగుగాక ! చచ్చినఁ జత్తుముగాక ! కాని నేను నాభారతవర్షసత్యమూర్తిని-పూర్ణమూర్తిని ఎప్పటికైన మఱచిపోఁగలనా? అనియెను.

వినయ—గోరా ! నీవిట్లుద్రేకముతోఁ జెప్పుచుంటివా, సత్యముగనే చెప్పుచుంటివా ?

గోరా మేఘగంభీరభాషణములతో "సత్యమే చెప్పుచున్నాను !" అనియెను.

వినయ—గోరా ! నీవలె నెవ్వరును గ్రహింపలేరా ?

గోరా—అట్లందఱును గ్రహించునట్లు చేయుటయే నాపని! సత్యస్వరూపమును దెలిసికొనఁజాలకున్నచో లోకులు ఛాయాస్వరూపమునందే యాత్మసమర్పణము చేసికొనరా? భారతవర్ష సర్వాంగసౌందర్య మండితకన్యక యెదుటను బ్రదర్శింపఁబడియును. అప్పు డందఱును దానికి వశులైపోవుదురు. అప్పుడు నీవు చందాలకొఱకు గుమ్మములవెంటఁ దిరుగవలసి యుండునా? జనులు తమంతఁదామే ప్రాణములనైన నర్పించుటకు సర్వసిద్ధులై యుందురు!

వినయ—గోరా! అట్లయినచో నాకా సత్యస్వరూపము జూపింపుము! కాదేని లోకముతోఁబాటుగ నన్నుఁబోనిమ్ము!

గోరా—సాధన చేయుము! విశ్వాస మున్నచో నుపాసనాబలమువలన నీకు సుఖము కలుగఁగలదు. సుఖాసక్తులగు మనదేశాభిమానులంతగా సత్యవిశ్వాసము కలవారు గారు. అందుచేతనే వారు తమశక్తియందును, నితరులశక్తియందును, గూఢ నమ్మకము లేనివారగుచున్నారు. స్వయముగాఁ గుబేరుఁడు ప్రత్యక్షమై వరమిచ్చెదననినను గవర్నరు దొరగారి జమాదారు మెడలోని గిల్టుపువాలికంటె నెక్కువ కోరుకొనుటకు వారికి ధైర్యముండునని నేననుకొనను. వారికి విశ్వాసము లేదు కావుననే ధైర్యమును లేదు!

వినయ—గోరా! అందఱిస్వభావము నొక్కరీతిగా నుండదు. నీవు నీబుద్ధియందే విశ్వాసము కలిగియున్నావు; స్వశక్తినే యాశ్రయించి పని చేయుచుందువు. అందుచేతనే నీవితరులశక్తిగతులను గ్రహింపఁజాలవు. నీవు నన్నేదైన పనియందు నియోగింపుము. నాకుఁ బొద్దు పోవుటలేదు. నీయొద్ద నున్నప్పుడుమాత్రమే నాకుఁ గొంచెము కాలక్షేపమగుచున్నది. తరువాత నూరక యుండవలసివచ్చుచున్నది.

గోరా—నీవు పనిమాట యడుగుచున్నావా? స్వదేశసంబంధము లగువానిని నిస్సంకోచముగను, నిస్సంశయముగను, సంపూర్ణముగను బ్రేమించుటయును, దేశమునందు విశ్వాసములేనివారిహృదయములయం దట్టిప్రేమభావమును బుట్టించుటయును మనకిప్పు డవశ్యకర్తవ్యమై యున్నది. దేశవిషయమున నభిమానహీనులమై యుండి మనము మనహృదయములను దాసత్వవిషముచే దుర్బలములైనవానిగాఁ జేసివైచుకొన్నాము. మనలో నొక్కొక్కఁడు నాదర్శపురుషుఁడై దానికి బ్రతీకారమును గావింపఁగలిగినచో నప్పుడు మనకార్యక్రమమునకు సుక్షేత్రము లభింపఁగలదు. అట్లు కాక మన మేపనిచేసినను గేవలమును బాఠశాలయందలి చరిత్రపాఠపుస్తకము ననుసరించి యితరు లందఱు చేసినపనివలెనే యుండును. ఇట్టి నిరర్థకకార్యమునకై సత్యముగా మనసర్వశక్తులను, ప్రాణములను వెచ్చింపఁగలుగుదుము! అట్లు చేయుట మనదైన్యమును మఱింత వర్ధిల్లఁజేసికొనుటయే.

ఇట్లు వారు సంభాషించుకొనుచుండఁగా నొకహుక్కాను జేతఁబట్టుకొని మృదు మందహాసభాసమానముతో మహిముఁడాయింటఁ బ్రవేశించెను. ఇది కచేరినుండి వచ్చి, తేనీరు త్రాగి హుక్కా గొట్టమును నోటఁబెట్టుకొని, హుక్కాను జేతఁబట్టుకొని, శిథిలమైనమునొద్దఁ గూర్చుండి మహిముఁడు తమాకు సేవించుసమయము! ఇంక గొంతసేపటి కొక్కొక్కరుగా నరుగుపారుగున స్నేహితులందఱును వత్తురు. అప్పుడు సింహద్వారముకడ నున్నగదిలోఁ గూర్చుండి వారందఱను జేరి పేకాట యాడుకొందురు. మహిముఁడు లోపలఁ బ్రవేశించినతోడనే గోరా కుర్చీనుండి లేచి నిలువఁబడియెను. మహిముఁడు హుక్కాను బీల్చుచు "భారతోద్ధరణమునకై కొట్టుకొనుచున్న నీవు సంపూర్ణముగా నీసోదరు నుద్ధరింపఁగలవు!" అనియెను.

గోరా మహిమునివంకఁ జూచుచు నూరకుండెను. అప్పుడు మహిముఁడు "మా ఆఫీసునకు గ్రొత్తగా వచ్చినదొక బుల్ డాగ్ వలెఁ జూచుచున్నవాఁడు. అతఁడు బంగాళీ బాబులను "బేబూ" అని పిలుచుచుండును. తల్లి చచ్చుచున్న దన్నను నొక్కరికిని సెలవీయఁడు. ఒక్కనికైనను జీతము పూర్తిగా ముట్టనీయఁడు. నెలనెలజీత మంతయును జరిమానాక్రిందనే కడతేరి పోవుచున్నది. ఇతనిమీఁద నెవ్వరో కాళీ రామన్నయను తరమున వచ్చినను నిని నేను వ్రాసితి ననియే యనుమానించి సత్యాసత్యములు గ్రహింపకయే నాచేత నొకదూషణాపత్రమును బలవంతముగ వ్రాయించుకొనుచుండెను. మీరు, యూనివర్సిటీసముద్రమును మథించి బయలుదేఱిన రత్నములు. ఈయుత్తరమును బాగుగ సవరించి వ్రాసిపెట్టుము! — "even handed justice, neverfailing generosity, kind courteousness" మొదలగునవి తీసికొనవలయును.

గోరా మాటాడకూరకుండెను. వినయుఁడు నవ్వుచు "అన్నా! ఇన్నితప్పు లొక్కగుక్కలో నెవఁడు పలుకఁగలఁడు?" అనియెను.

మహి—శత్రువియందు శాఠ్యమునే ప్రయోగింపవలయును. నాకుఁ జాలదినములనుండి వారితో సంబంధమున్నది. వారిసంగతి నాకుఁదెలియనిదేదియును లేదు. ఆదొరలసత్యము చెప్పువారినే గౌరవించుచుందురు. ఆంగ్లేయ స్నేహమునకు వారెట్టిపని నైనను జేయుదురు. వారిలో నొకఁడు తప్పుపని చేసినను నందఱును వానినే యనుమోదించుచుందురు. మనమట్లు చేయఁగలమా? కావున దెబ్బకు దెబ్బలాగున వారి నెంత మోసము చేసినను మనకుఁ బాపము లేదు."

అని మహిముఁడు పకపక నవ్వసాగెను. వినయుఁడు గూడ నవ్వునాపుకొనఁ జాలక పోయెను.

మహి—సత్యము చెప్పియే వారి నప్రతిభులం గావింపవలయు నని మీరనుకొనుచున్నారు కాఁబోలును! పరమేశ్వరుఁడు మీకట్టిబుద్ధులు ప్రసాదించుటచేతనే

దేశమున కిట్టిగతి కలిగినది! ఎక్కడైనను సాహసించి యాతనిదొంగతనము బట్టుకొన్న చో నాతఁడొక్కమాత్రము దనపనికి సిగ్గుపడక పైపెచ్చు పరమసాధువువలెఁ బైఁ బడి కొట్టుటకు సిద్ధపడును. ఇది నిజమేనా?

విన—సత్యము కాకేమి?

మహి—అంతకంటెను నసత్యప్రవర్తనమునకు దిగి మిథ్యావినయముతో నాతని పాదములను సేవించినచో నప్పు డాతఁడు నీకు సేవకుఁడైపోవును. అందువలన మన కు మంచికితాబులు లభించుటయే కాక మన శాంతికి భంగము లేకుండ నుండును. బాగుగ నాలోచించినచో నిదియే దేశభక్తి. కాని మనగోరా కీమాట యన్నఁ గోప ము! ఆతఁడు హిందువుఁడైనప్పటినుండియు నగ్రసోదరుఁడ నని నన్ను గౌరవించు చుండెను. కాని యిప్పుడేమో నామాట లాతనికి నచ్చుట లేదు. కాని,యేమి చేయు దును? ఆతఁడు సోదరుఁడు! అసత్యసంబంధమునందుఁగూడ సత్యమునే చెప్పవలసి వచ్చుచున్నది. వినయా! ఆయుత్తరము నొకసారి చూడుము! ఉండు ముందుము! నేను చిత్తుప్రతిని యున్నాను. అది తీసికొని వచ్చెదను.

అని చెప్పుచు మహిముఁడు తంబాకు సేవించుచు వెలుపలకుఁ బోయెను. అప్పు డు గోరా వినయునిం గాంచి "వినయా! నీ వన్నగారిగదిలోనికిఁ బోయి చూచు చుండుము. ఇంతలో నేను నాయుత్తరమును బూర్తి చేసికొందును" అనియెను.

౫

"వినుచున్నారా? నేను పూజామందిరములోనికి రాను లెండు! భయము లేదు. ఆహ్నికకృత్యములు ముగిసినచో మీరొకసారి యాగదిలోనికి రండు! మాటాడవలసిన పని యున్నది. ఎక్కరైన సన్యాసులు వచ్చినచో నింక మీదర్శనమే దొరకదు. అం దుచేతనే యిప్పుడు వచ్చి మనవిచేసికొనుచున్నాను! మఱచిపోక యొకసారి రండు" అని భర్తకుఁ దెలిపి యానందమయి యింటిపనులు చేసికొనుటకుఁ బోయెను.

కృష్ణదయాళుఁడు శ్యామలశరీరులతరగతిలోనివాఁడు. ఆతం డంతపొడుగరి కాఁడు. ఆతని మొగ మంతయును నెరసినగడ్డముచేఁ గప్పబడియుండును. అందలి పెద్ద కన్నులుమాత్రమే స్పష్టముగఁ గానవచ్చుచుండును. ఆతఁ డెప్పుడును గైరికవసన ములను ధరించి చేతియందుం గమండలువును, పాదములయందుఁ బాదుకలను దాల్చి యుండును. ఆతని నడినెత్తి బట్టతల యయ్యెను. మిగిలినకుంతలములను జేర్చి యాతఁడు మొగముమీఁదనే ముడివేచుకొని యుండును.

పశ్చిమమునం దున్నదినములలో నాతడు గోరాతోఁగలసి మద్యమాంసములను భుజించినవాఁడే. ఇప్పు డాతనికి దేశమునందలి పూజారులు, పురోహితులు, వైష్ణవులు సన్యాసులు మొదలగువారిపాదములపైఁ బడి ప్రణతిని జూపుటయే కాదు. మరు

జ్ఞానము కలిగినది. అట్టివారిలో నిప్పు డాతఁడు గౌరవింపనివా రెవ్వరును లేరు. శ్రౌతసన్యాసి యెవ్వఁడైన నగపడినచో నాతనియొద్దఁ శ్రౌతమార్గమును నేర్చుకొనవలయునని ప్రయత్నించుచుండును. నిగూఢమగు ముక్తిపథమునందును, నిగూఢమగు యోగమార్గమునందును నాతనికిఁగల యాశకు మేరలేదు. తాంత్రికసాధనము నభ్యసింపవలయునని యాతఁ డుపదేశము నంది కొంతకాలము ప్రయత్నము చేసెను. అప్పు డొకబౌద్ధపురోహితుని దర్శనము లభించుటచే నాతని యుపదేశములవలనఁ గృష్ణదయాళుని ప్రథమోద్దేశ మిప్పుడు మాఱిపోయెను.

ఆతనికిరువదియవయేఁట నాతని ప్రథమభార్య యొకమగశిశువును బ్రసవించి స్వర్గస్థురాలయ్యెను. తల్లిచావునకుఁ గారణమయ్యె ననుకోపముతో నాతఁ డాబిడ్డను మేనమామగారియింటికిఁ బంపివైచి యావైరాగ్యముచేఁ బశ్చిమమునకు వెడలిపోయెను. మఱి యాఱుమాసములకుఁ దరువాతఁ గాశీవాసియగు సార్వభౌముని మనుమరాలిని, పితృహీనను, ఈ యానందమయి నాతఁడు పెండ్లిచేసికొనియెను. పశ్చిమదేశమునందే యాతఁ డుద్యోగము చేసి పెద్దయధికారులగౌరవమును సంపాదించి యుండెను. ఇంతలో సార్వభౌముఁడు మరణించుటచే నితరపోషకు లెవ్వరును లేని యానందమయి నాతఁడు తనయొద్దకే తీసికొనిపోయెను.

సిపాయిమ్యూటిని సమయమునందుఁ గృష్ణదయాళుఁడు తన నేర్పరితనముచే నొకరిద్దఱు పెద్దదొరలప్రాణములను రక్షించెను. అందుచే నాతనికి యశస్సును, జాగీరును గూడ లభించెను. మ్యూటినీ ముగిసిన కొలఁదికాలమునకే యాతఁ డుద్యోగమును వదలుకొని పసిబిడ్డ యగు గోరాను దీసికొని కొంతకాలము కాశీయందు నివసించి యుండెను. గోరా కైదేండ్ల వయసు వచ్చునప్పటికిఁ గృష్ణదయాళుఁడు కలకత్తానగరమునకు వచ్చి యప్పుడు తన పెద్దకుమారుఁ డగు మహిమునిఁగూడ మేనమామయొద్దనుండి తన యింటికిఁ బిలిపించుకొని పెద్దవానిఁజేసెను. ఇప్పుడు మహిముఁడు తనతండ్రిగౌరవమునుబట్టి దొరతనమువారి ట్రెజరీలో నతిగౌరవముగఁ బని చేయుచుండెను.

గోరా చిన్నతనమునుండియుఁ దనబడియందును, బడిపిల్లలయందును నధికారము చేయుచుండెను. ఉపాధ్యాయపండితులజీవితములు మంచివి కావని నిరూపించుటయే యాతని ప్రధానోద్దేశము, సాహసము నైయుండెను. ఆతని కించుకవయసు వచ్చినప్పుడే బడిపిల్లల క్లబ్బునందు "అస్వతంత్రులై యెవ్వరు జీవింపఁగోరుదురు?— ఇరువదికోట్ల ప్రజలనివాసము!" అను విషయములనుగూర్చి యింగ్లీషుభాషయం దుపన్యసించి క్షుద్రవిద్రోహులకు సేనాపతి యయ్యెను. క్రమముగా గోరాబాలకసభ యనుగ్రుడ్డును భేదించుకొని వచ్చి యువకసభయందుఁ గాకలీస్వరమును విస్తరింపఁ జేయుచుండెను. అది కృష్ణదయాళుని వృద్ధవయస్సున కతికుతూహలముగనే యుండెను.

చూచుచుండఁగనే నగరమందు గోరాకు గౌరవప్రతిష్ఠలు పెరిగిపోవుచుండెను. కాని యింటియందుమాత్రము మెట్టుపోదు. మహిముఁ డప్పటికే యుద్యోగము చేయుచుండెను. అతఁడు గోరానుజూచి యొకప్పుడు "దేశాభిమానాగ్రణి" అనియు నొకప్పుడు "బుల్లరహాదీశముఖ్యుడు!" అనియుఁ బరిహసించుచుండెను. యింటియందే గోరా యప్పుడప్పుడన్నను గొట్టఁబోవుటకూడ జరుగుచుండెను. గోరాకు గల యాంగ్లేయద్వేషమునకై యానందమయి యెంతయు విచారించుచుండెను. ఆమె యాతని శాంతింపఁజేయుట కనేకవిధముల ప్రయత్నించెను గాని లాభము లేకపోయెను. గోరా వీధులయందును, ఘట్టములయందును, ఇట్టియాంగ్లేయులతో డీకొనఁగలిగినచో, తనజీవనము ధన్యమైనట్లు తలంచుకొనుచుండెను.

క్రమముగా గోరా కేశవచంద్రుని యుపన్యాసములకు ముగ్ధుడై బ్రహ్మసమాజమునకే విశేషముగా నాకర్షింపఁబడియెను. మరల నిప్పుడు కృష్ణదయాళుఁడు పూర్ణాచారపరాయణుఁడై గోరా తన గదిలోపలికి వచ్చుటకుఁగూడ సహింపకుండెను. ఆతఁడు ప్రత్యేకముగ నొకయిల్లు దీసికొని ద్వారమునందు "సాధనాశ్రమము" అను పేరితో నొక బోర్డును గట్టుకొనియెను. తండ్రి యిట్లు చేయుట గోరాకుఁ గష్టముగానుండెను. "ఈమూఢత్వమును నేను సహింపఁజాలను! ఇది నాకన్నులకు శూలమువలెనున్నది" అని యనుకొనుచు గోరా తండ్రితోడి సర్వసంబంధములు తెగతెంపు చేసికొని యెక్కడకైనఁ బోవుటకుఁ బ్రయత్నించుచుండెను. ఆనందమయి యాతని యెట్లో నుందలించి బోధించుచుండెను.

గోరా యెవరైనఁ దొరకినప్పుడెల్లఁ దండ్రికడకు వచ్చుచుఁ బోవుచుండు బ్రాహ్మణపండితులతో వాదము చేయుట కారంభించుచుండెను. అది తర్కమే కాదు. విచారణయనియే చెప్పవచ్చును. అందుఁ జాలమందిపండితులకుఁ బాండిత్యముకంటె ధనలోభమే హెచ్చుగా నుండుటవలన వారు గోరా నతిక్రమింపఁజాలక యాతఁడనినఁ బెద్దపులివలె భయపడుచుండిరి. వారిలోఁ గేవల మొకె హరచంద్రవిద్యావాగీశ్వరునియందు మాత్రమే గోరాకు గౌరవముకలిగెను.

కృష్ణదయాళుఁడీవిద్యావాగీశ్వరుని వేదాంతచర్చకొఱకు నియోగించి యుండెను. గోరా మొట్టమొదట నీతనితోఁగూడ యుద్ధభావముతో వివాదపడుటకుఁ బ్రయత్నించెను గాని యది కొనసాగలేదు. విద్యావాగీశ్వరుఁడు కేవలము పండితుఁడు మాత్రమే కాక యత్యాశ్చర్యకరముగ నుదారస్వభావుఁడుకూడ నైయుండెను. కేవల సంస్కృతవిద్యాభ్యాసమువలన నిట్టి తీక్ష్ణప్రకాశబుద్ధి లభించునని గోరా యూహించియుండలేదు. విద్యావాగీశ్వరుని నడవడియందు శాంతిక్షమలును ధైర్యగాంభీర్యములును బరిపూర్ణములై యుండుటచే నాతనియెడల గోరా విధేయత చూపకుండ నుండఁజాలకపోయెను. అప్పటినుండి గోరా హరచంద్రునియొద్ద వేదాంతదర్శ

నములను జదువుట కారంభించెను. గోరా యేపనియైనను సగముసగము చేయువాఁడు కాఁడు. అతఁడు కేవలము నప్పుడు ధర్మాలోచనమునందే నిమగ్నుఁడైపోయెను.

ఘటనాక్రమమున నాసమయమున నొకయాంగ్లేయమతగురు వొకపత్రికయందు హిందూశాస్త్రములను సమాజమును నెదిరించి యావిధముగఁ దనతో వాదించుటకు హైందవపండితుల నాహ్వానించెను. అది చూచి గోరా మండిపడియెను. అవకాశము దొరికినప్పుడెల్ల దాను శాస్త్రములను లోకాచారములను నిందించుచు విరుద్ధమతసుల నెంతగాఁ దీక్షించుచున్నను నిప్పుడు విదేశీయుఁ డొకఁడు హిందూమతము నధిక్షేపించుట గోరా కంకుశముతోఁ బొడిచినట్లయ్యెను. గోరా యప్పుడు పత్రికాముఖముననే వాదించుట కారంభించి ప్రతిపక్షులు హిందూమతమునందును, సమాజమునందును నారోపించిన దోషములలో నొకదానినైనఁ గొంచెమైన నంగీకరింపలేదు. పత్రికాధిపతి యిఁక నేను ప్రకటింపఁజాల ననునంతవఱకును వాదము జరిగెను. గోరా యిఁకఁ గోపము వహించుకొని యింగ్లీషులో "హిందూయిజమ్" అను నొకపుస్తకమును వ్రాయ నారంభించెను. అందు సాధ్యమైనంతవఱకు సమస్తయుక్తులను శాస్త్రములను నుద్ఘాటించి హిందూధర్మమును గూర్చియు హిందూసమాజశ్రేష్ఠత్వమును గూర్చియుఁ బ్రమాణములను సంగ్రహింపఁబూనెను. ఈవిధముగా గోరా మిషనరీలతో వాదించి తుదకు దనవాదమును నెగ్గించుకొనియెను. "నాదేశము విదేశీయులకోర్టులయందు, విదేశీయుల శాసనానుసారముగా విచారింపఁబడుటకు నే నంగీకరింపను. ఏమైనను విదేశీయులయాదర్శనములతో మే మేకీభవింపఁజాలము. మాజన్మభూమియందలి యాచారములను విశ్వాసములను, శాస్త్రములను, సమాజములను గౌరవించుటయందు మే మెవ్వరియొద్దను నించుకంతయైన సంకుచితులమై యుండఁజాలము. సబలముగ—సగర్వముగ మా దేశగౌరవమును మానెత్తిపైఁ బెట్టుకొని మాదేశమునకును మాకు నెట్టి యవమానమును గలుగకుండ రక్షించుకొందుము" అని చెప్పుచు గోరా గంగాస్నానములను, సంధ్యాహ్నికములను జేయుట కారంభించెను.

అతఁడు నెత్తిపై నొక చిన్నజుట్టుపిలక నుంచుకొని, తినుట త్రాగుట మొదలగు వానిలోఁగూడ జాగరూకుఁడై యుండెను. ఇది మొదలాతఁడు ప్రతిదినమున సంధ్యాకాలమున దల్లిదండ్రులపాదధూళిని దలను దాల్చుట కారంభించెను. ఇదివఱకువలె నింగ్లీషుభాషలో "కాడ్, స్నోబ్" అని నిందించుట మాని గోరా తనయున్నగారగుమహిమను జూడఁగనే లేచి నమస్కారము చేయ మొదలుపెట్టెను. ఈయాకస్మికభక్తిం గాంచి మహిముఁడు నోటికి వచ్చినట్లెల్ల ననుచున్నను గోరా దానికిఁ బ్రత్యుత్తర మిచ్చుట లేదు. గోరా తనయుపదేశముచేతను నాచరణముచేతను దేశమునందలి కొంతమందిని దనతోఁ జేర్చుకొనఁగలిగెను.

